# మానవ - మాధవ సేవలు కలిసివచ్చే కలియుగ వైకుంఠ సేవ

## తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామివారిని దర్శించవచ్చే యాత్రికులకు

# అన్నప్రసాద వినియోగపథకము.

* సుమారు 1300 సంవత్సరాలకుపైగా అవిచ్ఛిన్నంగా ఆగమోక్తంగా ఆరాధన జరుగుతున్న ఏకైక దేవాలయం, శ్రీవేంకటేశ్వరాలయం బ్రహ్మోత్సవాది ప్రత్యేక సందర్భాలలో 50 లేక 60 వేలకు నడుమ, సాధారణ దినాలలో 20 లేక 25 వేలకు నడుమ, భక్తులు రోజూ దర్శించే దివ్యక్షేత్రం

* ఆసేతుహిమాచలం ఆరాధ్యదైవమైనమూర్తి శ్రీవేంకటేశ్వరుడు వేలాది భక్తులు ఆర్థిక స్తోమతలేని వారు ఉన్నదంతా వెచ్చించి శ్రీవారి దర్శనంకోసం కొండకు నడిచివస్తారు. తిరిగి తమతోపాటు శ్రీవారి ప్రసాదాన్ని తీసుకొనివెళ్ళి బంధుమిత్రులకు పంచుకోవాలన్న ఆరాటం సాధారణంగా వారికి వుంటుంది

* అటువంటి పేదయాత్రికులకు ఈ ప్రసాదాలను ఉచితంగా లభింపజేయగల్గితే అంతకుమించిన సేవలేదు.

* ఈ ఉద్దేశ్యంతోనే దేవస్థానం మధ్యతరగతి కుటుంబీకులుకూడ ఈ ధర్మకార్యక్రమంలో పాల్గొనేందుకు వీలుగా ఒక ప్రణాళికను ఏర్పాటుచేసింది. దాని ముఖ్యాంశాలు యివి .

శ్రీవేంకటేశ్వర నిత్యప్రసాద ధర్మాదాయ పథకంపేర జరిగే యీ కార్యక్రమంలో రు. 500/- "దేవస్థానం నిధి"గా యేర్పాటుచేసి ఎవరైనా పాల్గొనవచ్చును. ఈ నిధి బ్యాంకులో మూలధనంగా వుంచబడుతుంది దానిమీద సాలీనా వచ్చే వడ్డీతో ప్రతి సంవత్సరము 20 లడ్డూలు లేదా 15 వడలు లేదా 20 అన్నపు పొట్లాలను దాత పేర్కొన్న దినాన క్యూలైనులోని పేదయాత్రికులకు పంచటం జరుగుతుంది

* ఇది శాశ్వతనిధి కనుక ఒకసారి ఏర్పాటుచేస్తే దానిపైనవడ్డీ నిరవధికంగా వస్తూనేవుంటుంది దాత తనకు తమవారి పుట్టినతేది లేదా కల్యాణదినాలు లేదా తల్లి లేదా తండ్రి పుణ్యదినం లేదా తమకు ముఖ్యమనిపించిన తేదిని తెలిపితే ఆరోజున అతనిపేర లేదా అతడుపేర్కొన్న యితరులపేర యీ ప్రసాదం పంచడం జరుగుతుంది.

* ఆ నిర్ణీతదినాన ఉదయంపూట స్వామివారి దర్బారులో ఆదాతపేరు గోత్రం పేదయాత్రికులకు విరాళ మేర్పాటుచేసినట్లు అతని పేర ప్రసాదం పంపిణీ జరుపబోతున్నట్లు విన్నవించడం జరుగుతుంది.

* ఈ విధంగా రు. 500/- పద్ధతిన ఒక్కొక్కరు ఎన్నిరోజులకైనను యేర్పాటు చేయవచ్చును.

* ఈ విధంగా పది నిధులు లేదా ఒకేసారికి రు. 5000/- నిధి యేర్పాటుచేసినవారు నిర్ణీతదినాన సకుటుంబంగా ఆకార్యక్రమానికి హాజరుకావడమేకాక శ్రీవారిని దర్శనంచేసుకోవచ్చును.

* ఈప్రణాళికకు నిధి స్వీకరణ వెంటనే ప్రారంభమౌతుంది. ప్రసాదవినియోగం 1980 సంవత్సరంలో వచ్చే ఉగాదినాడు ప్రారంభమౌతుంది.

* శ్రీవారి దర్శనానికి వచ్చే యాత్రికసందోహంలో అతి పేదవారి సేవలో తరతమ భేదం లేకుండా అందరూ పాల్గొని శ్రీవారి ఆశీస్సులు పొందేటందుకు అపూర్వ అవకాశం.

* ఈ ప్రణాళికక్రింద చెల్లించిన డబ్బుమీద ఆదాయపుపన్నునుండి మినహాయింపు లభిసుందిగనుక దీనిక్రింద తమ విరాళములను పేర్కొని మినహాయింపు పొందవచ్చును.

* మానవసేవ, మాధవసేవ కలిసివచ్చిపుణ్యం రెండింతలుగా రాగల అపూర్వ అవకాశాన్ని ప్రతిభక్తుడు వినియోగించుకొని గోత్రం, లేదా ఇంటిపేరు, దాతపేరు, వినియోగం జరపవలసిన ప్రసాదంపేరు, వినియోగం జరపవలసిన తేది పేర్కొని విరాళాలు పంప అభ్యర్థన.

* 'విరాళాలను, ఏ బ్యాంక్ డి. డి, ద్వారానైనా కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం' పేర, మేనేజర్ ఆంధ్రాబ్యాంక్, గాంధిరోడ్డు తిరుపతి 517501 అనేవిలాసానికి పంపండి లేదా దేశంలోని ఆంధ్రాబ్యాంక్ వివిధ శాఖలలో చెల్లించవచ్చు.

తిరుమల తిరుపతి దేవస్థానం తిరుపతి.